# లోకరక్షకుని జననము.

—:❀:—

ద్వి॥ శ్రీకరంబుగ సర్వ - సృష్టి నిర్మించి
ప్రాకటంబుగ శక్తిఁ - బరఁగఁ బాలించి
సత్యవేదాచార - సరణిల నొప్ప
నిత్యశక్తి వెలసె. - నిజమిది. తత్వ
మారయ, సర్వేశు - మహిలోన జనుల
ఘోర కిల్బిషలతల్ - గోసి మోక్షాప్తి
బగునట్లు చేసి యీ - యవని రక్షించె
నిగమ సంచారుండు - నిత్యానందుఁడు.
గావున సర్వేశు - ఘన సుచరిత్ర
మీ వసుధ నెగడ - మేకొని భక్తి
గావించి చెప్పెదఁ - గాన మీరెల్ల
సేవించి సత్కథ - చెవులిచ్చి వినియు,
నిత్య దేవుని ముఖ్య - నెలకొన్న మోక్ష
మత్యంత భక్తి, య-మర నందివచ్చు.
దేవ దేవుండిట్లు - దీన మర్త్యులను
గావఁగ నిర్చిన - కాలంబునకును
నెనుకటి నాలుగు - వేల యబ్దములు
మనుజ సంతతిఁ బ్రోవ - మన్నింప సుతుని
ననుప నూహించుచు - నచటఁ గ్రాఁబేల
ను, నతంపు పరుగిడ - ననఘు నీవేగి
కనకాంగి మరియాంబ - కన్యను జూచి
వినుపింపు, శ్రీదేవ - విమల పుత్రుండు

‘ కడుపున( గొడుకుగా( - గల్గును మీకు,
‘ మడియతనంబున - మన లెను జనుల
‘ పాపంబు నెడబాపి - పాలించు ననుచు(
‘ దీప్రగ నే( జెప్పి-తినని చెప్పు’ మనిన,
పలుకులకును సమ-ర్పణములు చెప్పి
సెలవిచ్చి పొమ్మనె( - జెలిమితో విభుడు.
కన్నెయామణి యుప్పు - గర్భంబు దాల్పు(
బన్నగా సన్మతి - పడియుండు. నంత 15.
దేవ పుత్ర విమల - తేజంబు తనకు(
బావన గర్భమై - పర(గెనే యపుడు.
అటుపిమ్మటను మరి-యాంబ గర్భమున(
దటుకున దేవుండు - తరలి విచ్చేయు
టది యెల్ల తెల్పెద( - దయ్యాక వినుడు
సదమల మతిని స-త్సభవారలెల్ల. 18
వ. దంపతులగు మరియమ్మయు( జోజప్పగారు సన్యో
న్య స్నేహమున సంతోషచిత్తులై సర్వజనసమ్మత
మున నజరేత్తులోనుండ( సంభవించిన దేమనిన.
సీ. నరనాథుడు రోమ-పురి చక్రవర్తి దా( 19.
ప్రజల( బాలన చేసి - ప్రభుడనంగ(
దన ప్రభుత్వములోని - జనుల లెక్కింప(గ(
బనిచె యోధుల మహా-బలయుతులను.
జనులెల్ల జనకుల - యునికిపట్టుల కేగి
పేళ్లు వ్రాయుడటంచు( - పెద్ద హుకుము
వచ్చినది, దావీదు - వంశస్థులై యుండ;
మరియ జోజేపులు - మంద గతిని

దూరి రాయిడగి, వలి-తోఁ దోఁపులాంటి
దానిలోవల నుండఁ; - దరలాక్షి కుక్షి
లోనున్న దేవుఁడు - లోకంబు బ్రోవఁ
దన దివ్య మహిమలు - దాఁచి యీ పుడమి
జనులను బ్రోవరా, - సమయ మేతెంచె. 33.

సీ॥ పరలోక ధ్యానులై - ప్రబలిన నిర్జరుల్
పశుల కొట్టము కడఁ - బాలిరియొద్ద
జేరి, గర్భస్థుఁడై - చెన్నుమీరిన కర్త
కనుకూల బుద్ధిచే - నాడి పాడి
జనుల రక్షింపఁగఁ - జనియించు దేవుని
స్తోత్రముల్ చేసిరి, - సొబగు మిగుల
సంతోష ముప్పొంగఁ - జాల హర్షముతోడ
సంగీత భజనలు - సలుపుచుండఁ

తే॥ ఇవ్విధము సకల నిలింపు - లింపుఁ జెంద,
సకల లోకంబులెల్లను - సౌఖ్యమొందఁ,
జన సమూహము లెల్లను - సంతసిల్ల,
రాజధాని సుధర్మమై - రాజిలంగ, 34.

ద్వి॥ నయ్యెడ నెలలైన - నా యిందుముఖికి
చయ్యన పుత్రక - సంభవ వేళ
సమకూడె. నప్పుడా - చాన మర్యాంబ
సుమహిత బుద్ధిచే - శోభిల్లి దైవ
సన్నిధిఁ జేరి యా - సర్వ రక్షకునిఁ
జెన్నుమీర దలఁపు - చేయుచునుండఁ;
వినుఁడు, మేఘము బాసి - యింపుమీరంగఁ
జనుదెంచు కైవడి - సర్వ రక్షకుఁడు

తల్లి గర్భముఁ బాసి - ధర బవళింపఁ,
జల్లఁబడె నప్పుడు - సకల లోకములు. 39.

వ॥ ఇవ్విధమున రాత్రినడిజామునఁ గన్యతనయుఁడు
పుడమిపైఁ బవళించినతోడనే, సన్మనస్కులా
ప్రాజితుని నుతియించుచు నా బాలుఁడు రక్షణ
కొఱకుఁ జేయుపనుల నెల్లను బాగడి రెటువలెను.

సీ॥ ప్రణుతించరే బాల - పాదార విందముల్ ? [40.
వినుతించి వేడరే - వీను లలర ?
ముద్దులు గొనరె యా - ముల్లోక నాథుని
యొద్ద నద్దడక యా - యుర్వి నాథు
కరములు ముకిళించి - కరుణతో మ్రొక్కరే ?
కాచి రక్షించెను - కర్త యితఁడు
పాలించి మన కోర్కె - లాలించి యిచ్చును
మరియాంబిక గన్న - వర సుతుండు.

తే॥ అహహ ! యేమందు మింకను - నతని మహిమ
మోక్ష రాజునకు సుతుఁడు - మోద మలరఁ
బుడమి మానవావతారుఁడై - పుట్టె నిపుడు
పశుల కొట్టమునఁ గాటిలోఁ - బాప పగిది. 41.

వ॥ పరమ బాలునిఁ బొగడ సన్మనస్కులు సమూహ
ములన్నియుఁ బశులకొట్టముఁజేరి యివ్విధంబునఁ
బాటలుపాడు చుండగ నాకాశవీధి ననేక
నిర్జరులు పాటలు మిన్నంటఁ బాడుచు నంచున
గొల్లమందఁ జాగరించుకొనియున్న గొల్లవారల
కష్ట విశేషంబు దెల్పెనట యెటువలె. 42.

సీ॥ ఆ రాత్రి బెత్లెహే-మను నూరి పొలములోఁ

గోష్ఠిలు గాచుచుఁ - గొల్లవార
లుండ్రి నిమ్మపటస్థ-లుత్త మోత్సములప్పు
డాకాశమున వెల్గు - నట్టి కాంచి
యా వెల్గులోనున్న - యమరుని వీక్షించి
భయమంది దేహముల్ - బడలు పడఁగ;
వడకు చుండెడి వారి - వైపున వీక్షించి
'భయమేల మీ' కని - పలికె నన్న

తే॥ నన్నుఁడో: 'రోరి వినుఁడు జ-నాథులార!
'పిరికి తన మొండ నేల? ని-ర్భీతి నుండ
'సమయ మేతెంచె, నొకవార్త - సాంగముగను
'వినుఁడు తెల్పెద, సౌఖ్యముల్ - వేయి గల్గు,

సీ॥ 'వినుఁడి, గోపకులార! - విమలమౌవార్తలు, [43.
'దావీదు పురమునఁ - దాసుల కొఱకు
'దేవ దేవుఁడు కల్గె - దివ్య తేజంబుతో
'మరియమ్మ కొమరుఁడై - మహిమమీర,
'వేగముగా వెళ్లి - వేఁడుకలు కలుగఁ
'గనుకొనుఁ డీవేళ - గాఁడియందుఁ
'బొత్తి గుడ్డలలోనఁ - బుణ్యరక్షక క్రీస్తు
'పసిపాపయై నేఁడు - బవ్వళించె'.

తే॥ గొల్లవారికి సత్స్వాంతుఁ - డుల్లమెల్లఁ
బల్లవింపఁగఁ జెప్ప నా - పైన నుండి
ఖచర కోటులు దేవుని - గానములను
బొగడు కొనుచును టగిరి యి-వ్విధమి పైకి 44.

వ॥ ఇట్లు పాడిన సన్మనస్కు లంతర్ధానులైన పిమ్మట
గొల్లలు భయముదీరి యానందచిత్తులై దేవ

బాలునిఁజూడ సిద్ధపడుచున్నా రెటువలెను. 45.

ద్వి॥గుప్పున గోపిక - గొల్లలు లేచి
ముప్పిరి కొనువేడ్క - మొనసి వారెల్ల
సుఖముగఁ దేవునిం - జూడంగ బోయి
నిఖిలేశ్వరుని మ్రోల - నిలిచి సేవింపఁ
దడయక రిక్త హ-స్తములఁ బోలేక ;
అడవి గుంటల వల్లు - అటుకులు కొన్ని
అరలేక తమిదల - అప్పాలు కొన్ని
ఒరగుజ్జు గోధుమ - ఒబ్బట్లు కొన్ని 49.
రోట దంచని సజ్జ - రొట్టెలు కొన్ని
వాటమౌ మృదుపిండి - వంటలు కొన్ని
క్రొత్త కొబ్బిల బిళ్ల - కుడుములు కొన్ని
గుత్తంపు టనుముల - గుగ్గుళ్లు కొన్ని
ఉత్త మాంగనులెల్ల - యున్న దున్నట్లు
యెత్తుకొని జనిరి - దేవుని కొఱకు. 52.

వ॥ ఇవ్విధంబున గోపికలున్ను గొల్లలున్ను కానుక లెత్తుకొని యేకముగఁ బశుల కొట్టంబుకుఁబోవు సమయమునఁ బాటలుపాడిరఁట యెటువలెను53.

సీ॥ ‹ జనులార ! కాంతమై - జని నిర్జరుఁడు మండ
‹ లించినవా స్తి నా-లించరారె ?
‹ బెత్లేహేపురి నొక - పేద కన్యకు మహా
‹ దేవ దేవుఁడు కలిగి - దేజరిల్లుఁ.
‹ బశుల కొట్టంబునఁ - బఱతి పొత్తులఁజుట్టి
‹ గాఁడిలోఁబెట్ట నా - ఘనయుదారుఁ
‹ డున్నవాడఁట బాలుఁ - డుర్విలో జనులను

గాచి రక్షించెను - కర్తగాడె?
తే॥ గాన మనమెల్ల కానుకల్ - కరములందుఁ
బూని దేవుని హృష్టునఁ - బొగడు కొనుచుఁ
గాడిఁ బదుకొని యుండెను - కర్తఁజూడ
సకల జన సమూహములెల్ల - జనరె వేగ. 54.
ద్వి॥పురుషులు సతులు సం-పూర్తి సంతోష
కరముగ నూరికిఁ - గారము నరిగి,
యన్నమాంబ సుపుత్రి - యగు దేవమాత
కన్నట్టి పురిటిల్లు - కను వేగఁ జొచ్చి
గొల్లలందఱుఁ గూడి - కోలాహలముగ
వెల్లి కొట్టములోన - వేంచేసి యున్న 57.
దేవుని కిచ్చిరు - దీన కానుకలఁ
బావన మతినారు - [illegible] బడుచు
వలనొప్ప బాల [illegible]-వమునకు నొసఁగి
తిలకింపుచుండిరా - దేవుని హాపు.
పరఁగ బాలుని పద - పంకజ యుగళ
మరసి ముద్దిడ మహా-నందాబ్ధి మునిగి
నారులెల్లరు భజ-నలుచేసి కడన
ధారుణి [illegible]బడి - తగ మొక్కి జనిరి. 61.
తే॥ ఇట్లు గొల్లలు పూజించి - యింపుమీర
హర్షమున కన్యకాపుత్రు - నరసి యరసి
సంభ్రమంబులు మదిలోన - సందడిగొన
సాగి వెళ్లిరి తమ తమ - స్థానములకు. 62.
క॥ అప్పుడు పశువుల గాపరు
లెప్పటివలె యుండ కడకు - నేగిన పిదప

దప్పక యెనిమిది దినముల
గొప్పిదమని జేసు నామ - మొనరం జేసెఁ. 63.
తే॥ జేసువను పుణ్యనామ మీ - క్షితి నరులను
సంతరించెడు వారను - సంజ్ఞకల్గి
భువనములం దృష్టిఁ జెందించి - పుడమిలోన
ఖ్యాతి జెందెను చంద్రిక - భాతిఁదనరి. 64.
వ॥ దేవతనయుఁడు తమ దివ్య జననమును యూదు
లైన నిమ్నపటు గొల్లల కెఱిఁగించినపిమ్మట నన్య
జనులకుఁ బుట్టఁబడిని దెలుపుచున్నా డెటువలెను.
సీ॥ దీర్ఘదర్శుఁడు మున్ను - దెలిపిన రీతిని [65.
నక్షత్ర మొక్కటి - నభమునందుఁ
బొడమి యద్భుతకాంతిఁ - బుట్టించి వెలుఁగుటఁ
గనుగొని మువ్వురు - ఘన నృపతులు
అన్యయుఁడగు దేవుఁ - డవని మనిషికృతి
గలిగియుండు నంటంచుఁ - జెలిమివారి
లోకి వోటఁగలసి యాలోచన చేసియు
సైన్య సమేతులై - సంభ్రమమున
తే॥ మణిమయ కిరీటములు మంచి - ఘృణులనీనఁ
దారవారికి ముందఱ - దారిఁజూపఁ;
బరఁగ జెరుసల్యమను పేర్మి - పట్టణమున
కరుగుదెంచిరి శ్రీ బాల - నరయ నప్పుడు. 66.
వ॥ ఇట్లు జెరుసల్యముచేరఁగా నూతననక్షత్రం బదృ
శ్యంబుకాఁగా వారలు చేయువిధ మెటువలెను 67.
ఉత్సాహ॥ రాజవర్యులు మువురప్పుడు -
రాజధాని జొచ్చఁగా,

నోజనేగుదెంచు జనులు -
నొప్పమీర నడగ,: ' రా
' రాజ పుట్టిన స్థల మెచట -
' రయము మాకుఁ దెల్ప రే,
' సాజముగను వారికిపుడు -
' సాగిలపడి మ్రొక్కఁగా ? 68.
ఉత్సాహ॥ ' వారి తారఁగాంచి యచట -
' వచ్చి చేరఁగ, నదియే
' దారిఁబట్టి జనెనో కనము, -
' దైవమాయ ' మఁటనుచుఁ
వార లడిగినను ; జనాళి -
వార్తయుఁగక భీతితోఁ
గూర్చిరుఁడా హెరోదునికడఁ -
గూడి యనిరి యేకమై. 69.
వ॥ అంతట జనులవాక్యములకు హెరోదుఁడు భ్రాంతి
నొంది రాజులను గాంచి యేమనుచున్నాఁడు70.
ఉ॥ ' చక్కఁగ నేఁడు మువ్వురును -
' సంతస మొప్పఁగ నేలవచ్చిరో
' గ్రక్కునఁదెల్పఁ గాలమిది -
' గౌరవమొందుచు సంశయంబులే
' కిక్కడవాద మాడిరఁట -
' కీర్తి బయల్పడ జూద నాథుఁడీ
' దిక్కునఁ బుట్టినాఁడనుచుఁ -
దేటగఁ బల్కుఁడు మోదమందగా '. 71.
వ॥ అంతట ముగ్గురు రాజు లేమనుచున్నారు. 72.

ద్వి॥ వినుము, రాజేంద్రమా! - వృత్తాంతమెల్ల,
జనుదెంచితిమి, తూర్పు - జననాథులంద్రు.
పరమ తత్వసుజ్ఞాన - పారీణవృత్తిఁ
జరియించెదము. తూర్పు - జనపదమ్ములను
గొబ్బున మాకొక - క్రొత్త నక్షత్ర
మచ్చియుఁ గనఁబడె. - నఖిల లోకేశు 75.
ఆర్త రక్షకుఁడైన - యవని బుధుండు
మూర్తీభవించియు - ముల్లోకములను
శాపముఁ బోఁగొట్ట - బహుజూదతతిని
గాపాడు ననువార్త - ఘనుఁడొక్క దూరఁ
దరిశి దెల్పినవేద - తత్వంబుఁజూచి
యరసి వచ్చితిమయ్య - యవనేశరుండ'. 78.

క॥ వారడిగిన వార్తలకును
ధారుణిపతి హృదయమునను - దల్లడిపడి నా
మారు జనించెను పుడమికి
భూరమణుండనుచుఁ జాల - బుద్ధిఁ బొగిలెఁ 79.

తే॥ సభికులెల్లరు సభలోన - సందడింప
వేదవేద్యుల నాచార - వివరిసెల్ల
సభకు రప్పించి క్రీస్తుఁడే - జనపదమునఁ
బొడమెనని రారాజుతా - నడుగుటయును; 80.

వ॥ వేదశాస్త్రిలందఱు, దీర్ఘదర్శులు చెప్పినది వీక్షించి యానందభరితాత్ములై, జూదయా దేశమునందు బెత్లేహేమున దయాసాగరుఁడైన క్రీస్తువు యవతారంబెత్తునని చెప్పిన; హేరోదుఁడు దుఃఖించి తన సభకు సెలవిచ్చిన వెనుక రహ

స్యముగా నారాజులతో నేమనుచున్నాఁడు. 81.

ద్వి॥ సజ్జనులార! యా - చుక్క పుట్టుకను
'ప్రజ్ఞ మీరంగ మీరు - పల్కరే యిచట?
'ననువుగాఁ బెత్లెహే - మ శిశువును గని
'చను దెంచిన పిదపఁ - జనుదునే' ననుచుఁ
దేన బాలునిఁ జంపఁ - దెంపునఁ దలఁచి
సావును దెల్పక - సాగి పోయెను.
శలభ మగ్గిని గ్రమ్మంగ - జని కాలుకరణిఁ
బలుగాకి పుడమిపైఁ - బడి చచ్చుగాక! 85.
జేసు నపకృతి - చేసెడి వాఁడు
గాసి జెందక యిల - కడదేర డిఁకను.
అడిగిన రాజును - నన్ని బోధించి
వడిఁ గాని లేచియా - వసుధాది పతులు
రాజును వీడ్కొని - రాజత్రయంబు
తేజీల నెక్కియే - తెంచి యా పురము
పేటికి వచ్చెసి - పైన వీక్షింపఁ;
దేటమౌ శుభ కాంతి - దెలిపించుచున్న
తారక రాజంబు - దారిఁ జూపింప,
వారు బెత్లేహేము - నగ్గకు వచ్చి
యరయుచు నుండంగ, - నాచిక్క మరియ
గురువును గిన్నట్టి - కొట్టంబు చేరి
కొట్టంబుపై నిల్చి - కొనియున్న చుక్క
పట్టి వీక్షింపంగ, - నంత మర్త్యాంబ
సదనంబులోనికిఁ - జని తల్లి బిడ్డ
లొడిగియుండుటగాంచి - కొయ్యన బుధులు 90.

వ॥ ఇట్లు ముగ్గురు రాజులు, మరియమ్మ తన సందిటఁ
బెట్టుకొని యున్న బాల యేసును వీక్షించి
యేమనుచున్నారు. 94.

సీ॥ ‹ దేవాది దేవుఁడా! - దీనులం బోషింపఁగ,
‹ దివ్య నక్షత్రంబు - తేజరిల్లఁ
‹ జేసి, సుజ్ఞానంబుఁ - జెందించి మీ శుభ
‹ దర్శన కౌతుక-త్వమున మెరసి
‹ యుండునట్టి యదృష్ట - మొందఁగాఁ బుట్టించి
‹ యింత మట్టుకుఁ దెచ్చి - రింపు మీర.
‹ సద్గురు రాయ! నీ - సర్వ ప్రభావంబుఁ
‹ జెప్పఁగా నెవ్వరి - చేతనౌను?
తే॥ ‹ అహాహ! మాభాగ్యమేమని - యనుదినంబు
‹ పొగడుచుందుము. మీ పద - పుండరీక
‹ ములను సేవించి కడతేరి - ముక్తిఁ జెందఁ
‹ గోరి విచ్చేసి నారమో. - ధీరవర్య! 95.

తే॥ ‹ కన్య భవ! మమ్ము మా భూమి - కానుకగను
‹ మీకు నర్పించితిమి. యిఁక - పాలికటముగ
‹ మిర్జయును హేమ ధూపంబు - మీకు నిచ్చి
‹ మ్రొక్కి లిడితిమి, సెలవిమ్ము - పెక్కులేల'. 96.

వ॥ ఇట్లు దేవ బాలుని స్తుతించి కానుకలను జెల్లించి
ముగ్గురు రాజులు వచ్చినమార్గమునఁ దమ తమ
పట్టణంబుల కేగ నున్న సమయమున. 97.

తే॥ ‹ మును వచ్చిన దారిఁ - జనక వేరొ
‹ మార్గమునఁ బోవుఁడయ్యా మీ - దుర్గములకు'
ననుచు నిద్దరలో నొక్క - యమరవరుఁడు

చెప్పఁ జనువార్త లాలించి - జరగి తప్పుడు. 98.

వ॥ ముగ్గురు రాజులు తనదగ్గఱకుఁ దిరిగి రానందుచేత హేరోదుఁడు భయపడి చేసినది యేమంటే.

సీ॥ దేవ దూతలు బాల - దేవునిఁ బొగడిన [99.
పొగడికలన్నియు - బొల్పుమీర
సుజ్ఞాను లొనరించు - స్తోత్రంబులను, విని
ప్రజలెల్ల సంగడిఁ - బలుకుచు జేసు
జెరుసల్యాపురి నృప - శేఖరుండై సర్వ
జూద జనాళినిఁ - జోద్యమలర
నేలు నటంచును బాలు-మూలక పల్కు-
జన వాక్యముల - నసి సన్నగిలెఁగి,

తే॥ కూరమతియై హేరోదుఁడా - ‹ కువలయేశ
‹ త్రయము యేవారిని జనిమెనో - బయలు దేరి
‹ బాలకుని జంపితేగాని - పడయరాదు [100.
‹ రాజ్యమును గీర్ష్య' మనియె నా-రాజవిభుఁడు.

వ॥ ఇట్లు క్రోధోద్దీపితుండైన హేరోదురాజు చేయు విఘ్నంబెటువలెను. 101.

ద్వి॥ జెరుసల్యాపురి నృప - శేఖరుండలిగి
పరువడి మీరఁగఁ - భటుల రావించి:
‹ ముందుగాఁ బెత్లెహే-మునఁ దానచుట్టు
‹ నందమొప్పెడు పట్ట-ణంబులలోనఁ
‹ బెరిఁగెడు బాలురఁ - బిడెముచఁ జంపు
‹ డరమరలే' కని - యాజ్ఞలు చేయఁ;
కుటిలాత్మకులు మహా - కుచ్ఛితమతులఁ
బటుతరాయుధములఁ - బట్టుకొని కుపిత -

కాలకించకరులచేఁ - గడలి రప్పరికిఁ.
బోలునే యిది నృప - పుంగవులకు నను? 106.

వ॥ అంతటఁ జోజప్పగారుకలలోఁ జూచిన దేమనఁగా.

చ॥ గగన చరుండొకం డరిగి -
కార్యము దెల్పుటకై నిశేచ్ఛతోఁ
బగఱుఁడు బాలఘాతకులఁ -
బంపి ప్రతాపముతోడఁ బాలురన్
దెగ సతికించుఁ, గాన మరు-
దేశము బాలుని మోదమందుచున్
నగ దెగి చేర్చి, యందున ని-
వాసము చేయు' మటంచుఁ బల్కెఁదాన్.

క॥ నిద్దుర మేల్కొని జోజెపు [108.
ముద్దుల బాలకుని దనదు - ముద్దియఁగొని తా
సద్దున్ సప్పిడి చేయక
గ్రద్దన నేతెప్పునకును - గదలెను పిలుచన్ 109.

వ॥ ఇట్లు జోజేఫు రాత్రిలో లేచి మరియమ్మనున్
బాలునిన్ని వెంటఁబెట్టుకొని పోవుచున్న సను
యమున. 110.

ఆ॥ ప్రైనమై నడవఁగఁ - బడిన బాధలు నోటఁ
బట్టి చెప్పఁదగునె - ప్రజకెవరికి?
సుతుని తల్లిదండ్రి - కుక్కనఁ దోడ్కొని
కతిపయ దివసాల - కఁరిగిరి వడిఁ. 111.

ద్విపద॥ అప్పునతొక - పీడనుండఁగను
కూరిరుడౌ హేరోదు - గోయను బంపఁ,
జారులు కెతేము - నరగునఁశేరి

ధారుణిఁ బిడ్డలఁ - దైత్యులబాఱి
గొంతులు గోయుచుఁ - గొందఱఁ బట్టి
యింతింతలుగఁ జేసి - యిల్లిలు దూఱి
చంకలోఁ బిడ్డల - సరగున నీడ్చి
కొంకక పొగవేసి - కోఁత కత్తులను 115.
నఱకంగ ; నింతంత-లై భువిఁ బడిరి.
మఱి గొందఱిని వారు - మమతయులేక
కడకాళ్లు పడఁబట్టి - కఱినోర్వఁగొట్టి
మడియింపఁ ; గొందఱు - మనుజఘాతకులఁ
గని పఱుగిడఁ బోవఁ - గదియఁగాఁ బట్టి
మొనసిత చురియల - ప్రక్కఁగాఁ గుచ్చి
ఒరసి పౌరజనంబు - లాహా! రవములు
బెరయఁగా నడలు - భీతిల్లి యేడ్చి 119.
'నరకాసు రారిట్టి - సంహార కృత్యము
'మఱలేక చేయ, నే-మందుమా యకట
'ఇఁక నేమి చేయుదు - మీఁక నెందుఁ జొత్తు
'మకళంక బాలుర - కాపదవచ్చె'
నారీతి నేడ్చుచు - నంగలార్చినను ;
ఘోరిర బంట్లకు రవ్వ - క్రుధ తగ్గదాయె. 122.

వ॥ మరియు జోసేపులు కొంతకాలమున నైగుప్తున నిలిచినపిదపఁ బరమేశ్వరుఁడు హేరోదుని దండించి చంపితిరని స్వప్నమున్కుఁడు చెప్పఁగ ; వారలు సరగున నజరేతు పురికిఁ జేరిరి. అచటఁ బరమ పావనమూర్తి ప్రబలుచునుండెను. 128.

సమాప్తము.

